స్థాపితము 1926 అక్టోబర్ నెం. ఎ- 93

# గోలకొండపత్రిక

సంపాదకుడు: ఎన్. నరోత్తమరెడ్డి, ఎం.ఏ

102325

సంపుటి 16 • సంచిక 70 | హైదరాబాద్ 15-3-63 శుక్రవారం | 4 పేజీలు 7 నయాపైసలు

### శ్రీ నెహ్రూకు శ్రీ సంజీవరెడ్డి లేఖ

హైదరాబాద్, మార్చి 14

నదీ జలాల సమస్యపై ప్రధాని శ్రీ నెహ్రూకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఒక లేఖ ఇటీవలగా వ్రాసినట్లు తెలుస్తున్నది. ఈ లేఖాంశాల వివరాలు బైట పడలేదుగాని 1951 ఒప్పందాన్ని పాటించవలసిందేనన్న ఆంధ్రప్రదేశ్ అభిప్రాయాన్ని శ్రీ సంజీవరెడ్డి శ్రీ నెహ్రూకు తెలిపారట. రాష్ట్రాల మధ్య ఇప్పటికే భేదాభిప్రాయాలు తీవ్రంగా ఉన్నందువల్ల పరిస్థితి విషమించకుండా శ్రీ నెహ్రూ జోక్యము తీసుకొని నదీజలాల వ్యవహారము తేల్చాలని శ్రీ సంజీవరెడ్డి తన లేఖలో మళ్ళీ కోరారని తెలుస్తున్నది.

### రాజస్థాన్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ వ్యాస్ మృతి

న్యూఢిల్లీ, మార్చి 14

రాజస్థాన్ మాజీ ముఖ్యమంత్రి రాజ్యసభా సభ్యుడునగు శ్రీ జయనారాయణ వ్యాస్ (64) నేడిక్కడ మరణించారు. ఆయనకు భార్య, ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలూ ఉన్నారు. శవాన్ని రేపు ఉదయము సఫదర్ జంగ్ విమానాశ్రయమునుండి విమానములో శ్రీ వ్యాస్ స్వస్థలమైన జోధపూర్‌కు తీసుకుపోయి రేపు సాయంత్రము అక్కడ అంత్యక్రియలు జరుపుతారు. రాజస్థాన్ ముఖ్యమంత్రి శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా సంతాపాన్ని తెలియజేశారు. రేపు రాజస్థాన్‌లో సెలవు ప్రకటించబడింది.

# మరోసారి కలుద్దా మనుకోడం తప్ప ఫలితం సున్న

## గుల్హాటీ నివేదిక అంకెల గారడీ

### శాసనసభలో శ్రీ ఎ.సి. వివరణ

### మన ప్రాజెక్టులకు ఆక్షేపణలు నిర్హేతుకమని ఇరిగేషన్ పద్దుల చర్చకు మంత్రి జవాబు

హైదరాబాద్, మార్చి 14

జాతి విస్తృత ప్రయోజనాలు, ముఖ్యముగా అధికాహారోత్పత్తి అవశ్యకతలను దృష్టిలో ఉంచుకొని భారత ప్రభుత్వమూ, ప్లానింగ్ కమిషనూ కృష్ణా గోదావరి నదీజలాల వివాదాన్ని పరిష్కరించాలనీ లేకుంటే దేశ ప్రయోజనాలకు విరుద్ధముగా వ్యవహరించినట్లే కాగలదనీ మైసూరు, మహారాష్ట్ర ప్రభుత్వాలు బలవంతమైన రాష్ట్రాలనుకొన్నట్లయితే ఆంధ్రప్రదేశ్ కూడా ఏమీ తీసిపోలేదనీ రాష్ట్ర ఇరిగేషన్ విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి యీవేళ శాసనసభలో తనశాఖ పద్దులపై చర్చకు జవాబిస్తూ హెచ్చరించారు.

మూడు దినాలపాటు ఇరిగేషన్ విద్యుచ్ఛక్తి శాఖ పద్దులను అసెంబ్లీ చర్చించింది. 43 కోట్ల మేరకుగల పద్దులను నేడు అసెంబ్లీ ఆమోదించింది.

ఆంధ్రులు [illegible]. [illegible] ఆంధ్రులంత గట్టివారూ లేరని అందరికీ తెలుసు. న్యాయమైనది సహేతుకమైనది కోరుతున్నాం. ఇందుకు తిరుగులేదు అని శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డి అన్నారు.

గుల్హాటీ సంఘము నివేదికలో ఏమీ లేదు, అది అంతా అంకెల గారడీ అని శ్రీ ఎ.సి. హర్షధ్వానములమధ్య ప్రకటించారు.

**కోయనాద్వారా జల దుర్వినియోగం**

మహారాష్ట్రలో కోయనా విద్యుత్పథకం ద్వారా 277 టి.ఎం.సి.ల కృష్ణా నీరు అరేబియా సముద్రం పాలవుతున్నది. ముందు దీన్ని అరికట్టాలి. అప్పుడు కృష్ణలో కావలసినంత నీరు ఇరిగేషన్‌కు లభిస్తుంది. ఇందుకు మైసూరు ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌తో కలిసి ఎదుర్కోవాలి అని శ్రీ ఎ.సి. అన్నారు.

నదీ జలాల సమస్య న్యాయయుత పరిష్కారానికి ప్రభుత్వం సర్వవిధాలా కృషి చేస్తున్నదనీ యిందుపై ఆందోళన పడ వలసిన అవసరం లేదనీ ఆయన ప్రస్తావించారు.

కృష్ణా-గోదావరులలో అదనపు నీరు ఉన్నదని గుల్హాటీసంఘముకూడా చెప్పలేకపోయింది. మనఅంకెలుతప్పని మహారాష్ట్ర, మైసూరు ప్రభుత్వాలు అన్నాయి. కాని కేంద్ర జలవిద్యుచ్ఛక్తి కమిషన్ మన అంకెల్ని పూనాలో, బెంగుళూరులో పరిశీలించి సరైనవని తేల్చాయి అని మంత్రి తెలిపారు.

**గోదావరి నుండి కృష్ణకు నీరు!**

ఖోస్లా కమిటీ వారు గోదావరి నుండి 100 టి.ఎం.సి.ల నీరు కృష్ణకు తెప్పించవచ్చు నన్నారు. గుల్హాటీ సంఘము 800 టి.ఎం.సి.ల నీరు రావచ్చునన్నది. మైసూరు ముఖ్యమంత్రి 1500 టి.ఎం.సి.ల నీరు గోదావరి నుండి కృష్ణకు మళ్ళించవచ్చునంటున్నారు. ఇదంతా కృష్ణ నీరు అవసరముగా తమకు కావాలని కోరేందుకు చెబుతున్న అంకెలు. కృష్ణ నీరు వ్యవహారం తేల్చడానికి నది నది [illegible] ప్రత్యేక పరిశీలన కావాలట. గుల్హాటీ సంఘము నివేదిక ఇంజనీర్ల నివేదిక కాదు, రాజకీయ నివేదిక అవాల్సి ఉంటుంది అని కూడా శ్రీ ఎ.సి. పేర్కొన్నారు.

**మన ప్రాజెక్టులు**

తుంగభద్ర ఎగువ కాలువ ప్రాజెక్టుకై మైసూరు ప్రభుత్వముతో మనకు ఒప్పందమే ఉంది. నాగార్జునసాగర్ ప్రాజెక్టును రెండు దశలుగానూ ఆర్థిక వ్యవహారాలవల్ల విభజించినవేగాని మొత్తము ప్రాజెక్టు ఒకేదశలో నిర్మించాల్సినదే. నాగార్జునసాగర్ నీరు శ్రీశైలం విద్యుత్పథకానికి వినియోగపడ గలదు కాబట్టి దానికి వేరే అదనపు నీరు అక్కరలేదు. మహారాష్ట్ర ప్రభుత్వం అన్ని ప్రాజెక్టులూ కట్టుకున్నా కూడా పోతంపాడు ప్రాజెక్టు మనం నిర్మించుకోడానికి నీరుంటుంది. ఇక మన ప్రధాన ప్రాజెక్టులకు ఆక్షేపణ లెందుకు అని మంత్రి శ్రీ ఎ.సి. ప్రశ్నించారు.

**అంకెలగారడీ, బోగస్ పథకాలు**

మహారాష్ట్ర ప్రభుత్వము కృష్ణా నదిమీద తలపెట్టిన ప్రాజెక్టులన్నీ కట్టుకుంటే ఎగువ కృష్ణా ప్రాజెక్టుకే మైసూరు రాష్ట్రానికి నీరుండదు. ఇవన్నీ బోగస్ పథకాలు అని శ్రీ ఎ.సి. అన్నారు. గుల్హాటీ కమిషన్ వారు కృష్ణానదీ ప్రవాహ దూరాన్నిబట్టి నదిలో నీరు 10 టి.ఎం.సి. ఆవిరైపోతుందన్నారు కాని గోదావరిలో నీరు ఆవిరి అయ్యేమాట ప్రస్తావించకుండా పైగా మరో 35 టి.ఎం.సి నీరు కలపాలన్నారు. ఇదంతా ఏదో అంకెలగారడీగా ఉందని శ్రీ ఎ.సి. పేర్కొన్నారు.

**రాజోలిబండా వివాదం**

రాజోలిబండా ప్రాజెక్టు హెడ్ వర్క్సు ఉన్నప్రాంతాన్ని ఆంధ్రప్రదేశకు ఇవ్వడానికి మైసూరు ఇష్టపడక పోతే ప్రాజెక్టును తుంగభద్రబోర్డు నిర్వహణకు వదలాలంటూ శ్రీ ఎ.సి. యీ వివాదము కృష్ణా గోదావరి జలాల వివాదముఅనంతరం చేపట్టబడుతుందన్నారు.

### గర్భకోశంలో 6 ఏండ్లుగా ఉన్న చనిపోయిన పిండం

గుంటూరు, మార్చి 14

ఇక్కడి ఆసుపత్రిలో ఒక స్త్రీకి ఆపరేషన్ చేయగా గర్భకోశం నుండి ప్రాణహీనమైన రెండుపిండాలు బయల్పడ్డాయి. ఒకపిండం 10నెలలది-ఇది ఆరు సంవత్సరాలుగా ఆ స్త్రీ గర్భకోశంలోనే ఉన్నదట- రెండో పిండం 4 నెలలది- ఇటీవలగా ఆమెకు గర్భకోశంలో నొప్పి వస్తున్నందున యీ ఆపరేషను జరిగింది- పది నెలల పిండము కావడం ఎముకలు మాత్రమే గర్భకోశములో మిగిలాయి. రెండుపిండాలు కలిసి 15 పౌన్లు బరువున్నాయనీ ఇటువంటి కేసు రెండు వేలమందికి ఒకటైనా ఉండబోదని ఆపరేషను జరిపిన ఆసుపత్రి అసిస్టెంట్ సర్జన్ డా. వి.రాంనాథ్ తెలిపారు-ఆపరేషను పిమ్మట ఆమె ఆరోగ్యము గానే ఉన్నదట.

### క్రీడాకారులకు అర్జున్ అవార్డులు

న్యూఢిల్లీ, మార్చి 14

1962 వ సంవత్సరానికై తొమ్మిది మంది క్రీడాకారులకు అర్జున్ అవార్డులు ఇవ్వబడినవి. వారిపేర్లు ఇవి:

త్రిలోక్ సింగ్ (అథ్లెటిక్), విల్సన్ జోన్స్ (బిలియర్డ్స్) మిస్ మీనాషా (బ్యాడ్మింటన్), పద్మంబ హేద్దుక్ మల్ (బాక్సింగు), టి. బాలారామ్ (ఫుట్ బాల్) సరేష్ కుమార్ (లాన్ టెన్నిస్), ఎమ్.తిరసింగు (వాలీబాల్) ఎల్.డి. దాస్ (వెయిట్ లిఫ్టింగ్), మాల్వా (రెస్లింగు).

ఈ బహుమతులు మార్చి 28 న రాష్ట్రపతిభవనంలో ప్రెసిడెంట్ డా. రాధాకృష్ణన్ చే బహూకరించబడుతవి.

## కాశ్మీర్ పై కలకత్తా చర్చల పర్యవసానం

కలకత్తా, మార్చి 14

క్రిందటిసారి కరాచీలో చర్చలప్పటి విభేదాలు ఏమీ సమసిపోకుండానే కలకత్తా చర్చలుకూడా ముగిసినాయి కాని ఉభయ ప్రతినిధివర్గాలనాయకులూ తిరిగి ఏప్రిల్ 1న కరాచీలో అయిదోసారి సంప్రదింపులకు అంగీకారం తెలుపుకున్నారు.

సింగ్- భూటోలు ఐదోసారి కలవాలని నిశ్చయించుకోడం మినహా మరే విధంగానూ కలకత్తాచర్చలు కాశ్మీర్ వివాదపరిష్కారానికి దగ్గర పడలేదని అభిజ్ఞవర్గాలు తెలిపాయి- పాకిస్తాను కొన్ని సూచనలు చేసిందటగాని అవి వేటిచర్చల్లో పరిశీలనకు రాలేదట-

తూర్పుపాకిస్తాన్, పశ్చిమ పాకిస్తానుల సరిహద్దులకు సంబంధించినవి, పాకిస్తానీల అక్రమప్రవేశాలకు చెందినవి-ఇతర సమస్యలు వేరే మంత్రుల స్థాయిసమావేశంలో పరిశీలించబడాలని కూడా సింగ్-భూటోలు నిర్ణయించుకున్నారని తెలుస్తున్నది-

ఈ సాయంత్రము వరకూ ఐదోసారి చర్చలు జరుగుతాయని ఎవరూ అనుకోలేదు.-కాశ్మీర్‌నుగురించి పాకిస్తాన్ కొన్నిసూచనలు తేగా మరోసారి సమావేశం అవుదామని భారత ప్రతినిధి సర్దార్ స్వర్ణసింగ్ అంగీకారం తెలిపారు- పాకిస్తాన్ కొత్త సూచనలేవో తెలుపబడలేదు-

రేపు విడుదల చేయబడగల సంయుక్త ప్రకటనను సిద్ధపరిచేందుకు సింగ్-భూటోలు యీరాత్రి మరో సమావేశము జరిపారు.

### ఉపఎన్నికలలో నిలబడే కమ్యూనిస్టులు

**డిటెన్షనులో ఉంటే విడుదల చేయబడగలరని శ్రీ సేన్ హామీ**

న్యూఢిల్లీ, మార్చి 14

ఉపఎన్నికల్లో అభ్యర్థులుగానిలబడేవారున్నట్లయితే వారిని డిటెన్షన్ నుండి విడుదల చేయించేందుకు ఎన్నికల కమిషన్ శ్రద్ధవహించగలదని నేడు రాజ్యసభలో కమ్యూనిస్టుపార్టీ నాయకుడు శ్రీ భూపేశ్ గుప్తకు న్యాయమంత్రి శ్రీ ఎ.కె. సేన్ హామీ యిచ్చారు. ఎన్నికల ప్రచారంలో మాత్రం దేశరక్షణకు ముప్పు తెచ్చే పరిస్థితులుంటే సహించబడదనికూడా ఆయన హెచ్చరించారు.

ప్రభుత్వం కమ్యూనిస్టుల్ని అణచివేస్తున్నదన్న శ్రీ భూపేశ్‌గుప్త ఆరోపణను ఖండిస్తూ శ్రీ ఎ.కె. సేన్ అసలు ప్రభుత్వాధికారాన్ని వినియోగించడములో యీ ప్రభుత్వం చూపినంత నిగ్రహం మరెవ్వరూ చూపజాలరన్న కీర్తి యీ ప్రభుత్వానికే దక్కుతుందని ప్రకటించగా హర్షధ్వానాలు చెలరేగాయి.

### గనిత్రవ్వకం పరికరాలు

**బ్రిటన్ నుంచి భారతదేశానికి సప్లయి**

న్యూఢిల్లీ, మార్చి 14

గనిత్రవ్వకం పరిశోధనకు ఉపయోగపడే రూ 15,000ల విలువచేసే పరికరములను భారతదేశానికి బ్రిటిష్ సాంకేతిక సహకార శాఖ సప్లయ్ చేస్తున్నది. కొలంబో ప్రణాళిక తాలూకు సాంకేతిక సహకార పథకం ప్రకారం జరుగుతున్నది. ఈ సహాయము, భారత శాస్త్ర వైజ్ఞానిక పారిశ్రామిక పరిశోధనా మండలి ధన్‌బాద్‌లో నెలకొల్పిన కేంద్ర గని పరిశోధన కేంద్రమునకు సప్లయ్ అవుతవి ఈ పరికరములు.

### గోవాకు విదేశీద్రవ్య నిబంధనల చట్టం అమలు

న్యూఢిల్లీ, మార్చి 14,

విదేశీద్రవ్యనిబంధనల చట్టం గోవా, డయ్యూ, డామన్ ప్రాంతాలకు కూడా మార్చి 11నుండి అమలులోకి తేబడినట్లు అధికార పూర్వకముగా తెలుపబడింది.

### తెనాలి హైస్కూలు హెడ్మాస్టర్‌కు పాతవిద్యార్థులసన్మానం

తెనాలి, మార్చి 14

మామూలుగా జరగక జరిగేది వంతులని సామెత. ఈ సామెత సమ్ము చేయాలని మొన్న 12నతేదీన తెనాలి హైస్కూలు పాత విద్యార్థులు ఒక నాటక ప్రదర్శనం నిర్వహించి లభించిన తమ గురువు తాలూకా హైస్కూలు హెడ్మాస్టర్ శ్రీ టి.ఎస్. నారాయణమూర్తికి 7వేల రూపాయలు బహూకరించారు. ఆయన జీవితాంతం సుఖముగా గడిపేందుకు పాత విద్యార్థి శ్రీ వి.ఎస్. శాస్త్రి అద్దెలేకుండా తన ఇంటిని గురువుకు ఉండడానికి ఇవ్వదలిచారు. 30 సంవత్సరాలుగా శ్రీ నారాయణమూర్తి తెనాలితాలూకా హైస్కూలుకు సేవచేశారు.

### సిరియా నూతన ప్రభుత్వానికి భారతదేశ పరిగణన

న్యూఢిల్లీ, మార్చి 14

సిరియాలోని నూతనప్రభుత్వాన్ని భారత ప్రభుత్వం గుర్తించింది- ఈ విషయము డమాస్కస్‌లోని భారతదేశ రాయబారి ద్వారా ఈ ఉదయము ప్రధానమంత్రి సాలాహ్ ఎల్ దిన్ అల్ బితర్‌కు తెలుపబడింది.

### విజయలక్ష్మి టాకీసుపై విద్యార్థుల దాడి

(మా విలేఖరి)

బందరు, మార్చి 14

స్థానిక విజయలక్ష్మి టాకీసుపై మొన్న సాయంత్రము సివిల్ యింజనీరింగ్ కళాశాల విద్యార్థులు మరి కొంతమంది ఇతరవిద్యార్థులు సుమారు 2 వందల మంది అల్లరిచేసి రాళ్ళురువ్వి థియేటరుకు సంబంధించిన అద్దములు, బల్లలు, టెలిఫోను, మొదలగు విలువైన సామానులను పగులగొట్టి నష్టపరిచినట్లు తెలుస్తున్నది.

ఒకరోజున ఒక విద్యార్థికి, థియేటరు యజమానులమధ్య జరిగిన సంఘర్షణవల్ల ఆ విద్యార్థి చిలకలపూడి పోలీసులకు ఫిర్యాదు చేసినట్లు ఆ సందర్భముగానే విద్యార్థులు నిన్నటి థియేటరుపైబడి అల్లరిచేసినట్లు తెలుస్తున్నది. అప్పుడే ఎక్కడికోవెళుతున్న ట్రాఫిక్ సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ కె. రాజమోహనరావు ట్రాఫిక్ యిన్‌స్పెక్టరు ఎం. రామారావు గార్లు వెంటనే ఈఅల్లరి చూచివచ్చి 2 వందల మంది విద్యార్థుల అల్లరిని అదుపులోనికి తెచ్చారు. అంతకుముందే థియేటర్‌లోని టెలిఫోన్ పగులగొట్టారట. సబ్ ఇన్‌స్పెక్టర్ల రాక థియేటరువారు తెలిపినది. ఈ విషయము తెలిసిన వెంటనే రిజర్వు ప్యాను పోలీసులు సంఘటనాస్థలానికి వచ్చిపడినాయి. పోలీసు సూపరింటెండెంట్ శ్రీ కె. రామకృష్ణశెట్టి కూడా వచ్చారు. విద్యార్థులు రాళ్ళు రువ్విన సందర్భములో 4గురుపోలీసులకు ఇద్దరు గేటుకాపరులకు దెబ్బలు తగిలినవట. సబ్‌యినిస్పెక్టర్ శ్రీ కె. రాజమోహనరావు కూడా గాయాలు తగిలినాయి. సర్కిల్ యినిస్పెక్టరు డి. కామదేవరావు, సబ్ యినిస్పెక్టర్లు శ్రీయుతులు కె. రాజమోహనరావు, ఎం. రామారావు, ఆర్. కె. మోహన్ గార్లు విద్యార్థులగుంపును చెల్లాచెదరు చేశారు. నలుగురువిద్యార్థులను అరెస్టు చేసినట్లు తెలుస్తున్నది. థియేటరుకు కొంత నష్టము కలిగివుంటుందని అంచనా వేయబడినది. థియేటరు చుట్టూ ప్యానులతో రిజర్వు పోలీసులు కాపలావున్నారు. ఆ ప్రాంతములో 144సెక్షన్ అమలులోవున్నది. విద్యార్థులు ఇంతవరకు ఏ అల్లరి చెయ్యలేదు. పోలీసు కాపలాలోనే ఈ రోజు వాల్మీకి సినిమా జరుగుతారని అనుకొంటున్నారు. పోలీసులు దిట్టముగా కాపలా కాస్తున్నారు.

థియేటరు యజమానులకు ఒక విద్యార్థికి మధ్య జరిగిన సంఘర్షణయే ఈఅల్లరిచేసినందుకు కారణమని చెప్పబడుతున్నది.

### మంత్రుల ఉపన్యాసాలపై పన్ను

న్యూఢిల్లీ, మార్చి 14

మంత్రుల ఉపన్యాసాలపై పన్ను వేస్తే బాగుంటుందని పి.ఎస్.పి. నాయకుడు హెచ్. వి. కామత్ ఒక సూచన చేశారు. లోకసభలో బడ్జెట్ చర్చలో పాల్గొంటూ ఈ పన్ను వల్ల ప్రజలకు బాధ నివారణ మాత్రమే కాక ప్రభుత్వానికి ఆదాయంగూడా వస్తుందన్నారు. మనదేశంలో 300మంది మంత్రులున్నారని వీరి ఉపన్యాసాలపై పన్ను వేస్తే పెద్ద మొత్తంలో ధనం చేకూరగలదన్నారు

### శ్రీ వి.కె. కృష్ణమీనన్ హైదరాబాద్‌కురాక

హైదరాబాద్, మార్చి 14

కేంద్రరక్షణశాఖ మాజీ మంత్రి శ్రీ వి.కె. కృష్ణమీనన్ ఈనెల 17 న ఇక్కడికి వస్తారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో దాఖలయిఉన్న ఒక ఎన్నికల పిటిషన్ సందర్భంలో ఆయన ఇక్కడికి వస్తున్నారని తెలుస్తున్నది. కేసులో పార్టీతరఫున ఆయన వాదించుటకు ఈనెల 18 న కోర్టుకు హాజరవుతారని చెప్పబడుతున్నది.

## 1964లో ముఖ్యమైన వంతెనలన్నీ సిద్ధం

### రాష్ట్రంలో రోడ్డు సౌకర్యాలను అఖిలభారత దామాషాస్థాయికి చేర్చవలసివున్నట్లు మంత్రివెల్లడి

హైదరాబాద్, మార్చి 14

వంద చదరపు మైళ్ళ ప్రదేశానికి 25 మైళ్ళ పొడవు రోడ్డుండాలన్న అఖిల భారత దామాషా స్థాయికి రాష్ట్రములో రోడ్ల మైలేజిని తృతీయ ప్రణాళికలో పెంచడానికి తలపెట్టినట్లు 14.65 కోట్లకు పబ్లిక్ వర్క్సు శాఖ డిమాండ్లను ప్రవేశపెడుతూ రాష్ట్ర శాసనసభలో మంత్రి మీర్‌అహ్మదలీఖాను తెలిపారు. ఇప్పుడు రాష్ట్రంలో మయిలేజీ స్థాయి 18 మయిళ్ళు అఖిలభారత దామాషా స్థాయికన్న 7 మయిళ్ళు తక్కువ- అని ఆయన చెప్పారు.

అన్ని ప్రధానమైన పెద్ద రహదారులనూ ప్రభుత్వాధీనములోను అన్ని స్వల్పమైన జిల్లారోడ్లు, గ్రామమార్గాలను స్థానిక సంస్థల అధీనములోను ఉంచాలని ప్రభుత్వము కృషిచేసి ప్రయత్నిస్తున్నదని మంత్రి అన్నారు.

1962 63 నుండి నాలుగు ఏళ్ళలో రాష్ట్రములోని చక్కెర ఫ్యాక్టరీల ప్రాంతాలందు 85లక్షల ఖర్చుతో 12రోడ్ నిర్మాణాలను నిర్మించడానికి పథకాన్ని రాష్ట్ర ప్రభుత్వము ఆమోదించిందనీ ఈ పథకము క్రింద 63-64 లో 11.55 లక్షలు వెచ్చించబడుతుందని పబ్లిక్ వర్క్సు మంత్రి తెలిపారు. గ్రామాలనుండి మెయిన్‌రోడ్‌కు దూరము సాధ్యమైనంత తగ్గిస్తూ చీఫ్ ఇంజనీర్లు, కన్సల్టింగ్ ఇంజనీర్ల కమిటీ సిఫార్సుల ప్రకారము 430 కోట్ల ఖర్చు మేరకు ఒక మాస్టరు ప్లాన్ తయారు చేయబడినట్లుకూడా ఆయన చెప్పారు.

**గోదావరి - కృష్ణా నదులపై వంతెనలు**

గోదావరి ఉపనదులైన గౌతమి, వసిష్ఠలపైన రెండు వంతెనలూ 1963 జూన్ నాటికి పూర్తవుతాయనికూడా మంత్రి ప్రకటించారు. కాశీ - కన్యాకుమారి జాతీయ రహదారిపై కృష్ణానదిమీద రోడ్డు వంతెన యీ సంవత్సరము మే నెల నాటికి పూర్తి కాగలదనుకుంటున్నామని శ్రీరామ లంక వద్ద గోదావరిపై వంతెనకూడా 1964 జూన్ నాటికే పూర్తి కాగలదని శ్రీ మీర్ అహ్మదలీ ఖాన్ నేడు శాసనసభలో తెలియజేశారు.

**కొత్త భవనాలు కట్టరాదు**

ప్రజాప్రయోజనాల దృష్ట్యా అత్యవసరమైతే తప్ప కొత్త భవనాల నిర్మాణాలు పూనుకోరాదని ప్రభుత్వము నిర్ణయించినట్లు పబ్లిక్‌వర్క్సు మంత్రి వెల్లడించారు. పొదుపుచర్యగా తక్కువ ఖర్చుతో సాదా నిర్మాణాలకు పబ్లిక్ వర్క్సుశాఖ పూనుకుంటున్నదన్నారు.

**ప్రత్యేక రైల్వే మండలం అభ్యర్థన**

పబ్లిక్ వర్క్సుశాఖ పద్దులపై చర్చను ప్రారంభిస్తూ శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య(స్వ) ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక రైల్వే మండలాన్ని సాధించాల్సిన అవసరం పేర్కొన్నారు. బెజవాడ - మచిలీపట్నం మార్గాన్ని మిక్స్‌డ్ గేజ్‌గా ఉంచాలని ఆయన సూచించారు. రాష్ట్రములోని మైనర్ రేవుల అభివృద్ధిని కూడా ఆయన కోరారు.

చర్చలలో పాల్గొన్న పలువురు సభ్యులు ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక రైల్వే మండలాన్ని కోరారు. రోడ్ల నిర్మాణం, మంచినీటి సప్లయి పథకాల విషయంలో కాంగ్రెసు ప్రభుత్వము తమ ఎన్నికల వాగ్దానాలను నిలబెట్టుకోలేదని శ్రీ రాంగోపాలరెడ్డి (నే. డె) అన్నారు. పబ్లిక్ వర్క్సుశాఖలో అవినీతి నిర్మూలనకు పూనుకోవాలని శ్రీ దామోదరరెడ్డి (కాం) కోరారు.

చర్చ రేపు కొనసాగుతుంది.

## ఉక్కు, విద్యుత్తులు ప్రగతి మూలకందాలు

### భిలాయ్‌వర్కర్ల ర్యాలీలో అన్ని రంగాలలో అధికోత్పత్తికై ప్రధాని ఉద్బోధ

భిలాయి, మార్చి 14

ఇరవై వేలమంది ఉక్కుపరిశ్రమ కార్మికుల సభలో నేడు ప్రధాని శ్రీ నెహ్రూ ప్రసంగిస్తూ చైనా దురాక్రమణవల్ల తగిలిన దెబ్బనుండి తేరుకోడానికి అధికోత్పత్తి, రక్షణదళాల పటిష్ఠత అవసరమనీ చవుకగా ఉండే నాణ్యమైన సరుకుల తయ్యారీ, మౌలిక పరిశ్రమల స్థాపన వ్యావసాయిక అధికోత్పత్తి ముఖ్యమనీ ఉద్బోధించారు.

మధ్యప్రదేశ్‌లో పర్యటన సందర్భముగా శ్రీ నెహ్రూ యీ ఉదయము భోపాల్‌నుండి భిలాయి చేరారు- వారిని విమానాశ్రయములో మధ్యప్రదేశ్ విద్యామంత్రి స్వాగతమిచ్చారు. శ్రీ నెహ్రూవెంట గవర్నరు పటాస్కర్, ముఖ్యమంత్రిమండ్లాయి కేంద్రకార్మికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంకూడా వచ్చారు విమానాశ్రయం నుండే ఆయన నేరుగా కారులో భిలాయి కర్మాగారము చేరారు-

శ్రీనెహ్రూ భిలాయి ఉక్కుకర్మాగారాన్ని సందర్శించారు కూడా-

ప్రజలజీవన స్థాయి పెంపొందించడానికి మొదటినుండీ అనేకరకాలుగా ప్రభుత్వం చేపట్టినదని వాటిని నిలుపరాదని పైగా మరిన్ని పథకాలను మనం అమలుజరుపుకోవాలనీ శ్రీ నెహ్రూ పేర్కొన్నారు- ప్రజలలో ఐక్యత, నిరంతరశ్రమ ఉంటేనే స్వాతంత్ర్య పరిరక్షణ సాధ్యమని యిందుకు ఉపన్యాసాలూ, తీర్మానాలూ లాభము లేదనీ మతతత్వాలు రాజకీయాల్లోదేశ విభేదాలు పెంచడము కూడని పని అని ప్రధాని అన్నారు-

ఇతరదేశాలలో సాంకేతిక ప్రగతిని ప్రధాని శ్రీ నెహ్రూ పేర్కొని మన దేశంలో వ్యావసాయికరంగం తనకు కున్నంతంగా అభివృద్ధి చెందనందుకు మనకిసాన్లు నవీన విధానాలకు అలవాటు పెంచుకోనందుకు విచారము వ్యక్తపరిచారు-

ఏమైనా ప్రస్తుత వేగాన్ని నిలుపుకొంటే మరో పది పన్నెండేళ్ళలో భారతదేశ స్వరూపము బాగా మారిపోగలదని ఆయన ఆశాభావం వ్యక్తపరిచారు కూడా- ప్రగతికి మౌలికాంశాలు ఉక్కు, విద్యుచ్ఛక్తి అని ఆయన అన్నారు. టార్గెట్ ఉత్పత్తి సాధించినందుకు ఆయన కార్మికుల్ని, మేనేజర్, ఇంజనీర్లను ప్రశంసించారు-

**రాయపూర్ లో**

భిలాయ్ నుండి శ్రీ నెహ్రూ రాయ్‌పూర్ చేరారు- అక్కడాయన యీసాయంత్రము ఇంజనీరింగ్ కాలేజీ భవనాలకు ప్రారంభోత్సవము జరుపుతూ ప్రగతి విధానాలు సాంకేతికవిజ్ఞానము యువజనులు అలవర్చుకోవాలని మూర్ఖపుసనాతనత్వము యువజనులకు కూడదనీ ఉద్బోధించారు-ఇంజనీరింగ్ విద్యార్థులు శాస్త్రవిజ్ఞానాన్ని ఆర్జించడమే కాక దాన్ని దైనందిన జీవితములో అమలులోకి తెచ్చి గ్రామగ్రామాన సాంకేతికచైతన్యానికి కారకులు కావాలన్నారు.

## మంత్రుల ఇళ్లల్లో నీరు, విద్యుచ్ఛక్తి అధిక వాడకం

### స్వచ్ఛందంగా పొదుపుచర్యలు తీసుకోబడుతున్నట్లు లోకసభలో మంత్రి శ్రీ ఖన్నా వివరణ

న్యూఢిల్లీ, మార్చి 14

ఉచితంగా తమకు సప్లయి చేయబడుతున్న విద్యుచ్ఛక్తి, నీటివాడకాలను స్వచ్ఛందముగా తగ్గించి పొదుపుగా వాడుకోవటం విషయంలో కొంత మంత్రులంతా తమకు తోడ్పడుతున్నారని నేడు లోకసభలో గృహవసతుల శాఖ మంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా తెలిపారు.

విద్యుచ్ఛక్తి, నీటిబిల్లుల మొత్తాల్ని తగ్గించేందుకు మంత్రులు కృషి చేస్తున్నారని ఆయన నేడు ఎదురయిన ప్రశ్న పరంపరకు జవాబిస్తూ అన్నారు-

స్వామి రామేశ్వరానంద (జనసంఘ) త్యాగమూర్తులయిన తపస్వులయిన మంత్రుల ఖర్చులపై చర్చ జరగాలని పట్టుబట్టగా శ్రీ మెహర్‌చంద్ ఖన్నా "సర్వసంగ పరిత్యాగులయిన తపస్వులయిన గౌరవసభ్యులు రాజకీయాల్లోకి ఎందుకువచ్చారో" అని అధిక్షేపించారు. దీనిపై జనసంఘ సభ్యులు ఆక్షేపణ తెలుపగా స్పీకర్ హుకుం సింగ్ మంత్రి అధిక్షేపణ సక్రమంగా లేదని రిమార్కుచేసి సభలో ప్రశాంతముగా ఉండాల్సిందిగా కోరారు-

శ్రీ మురార్జీదేశాయి మాట్లాడుతూ యీ విషయంలో తమయొక్క ఎక్కడ అవకతవకలు లేదని మంత్రులను అనవసరంగా వారు అధిక్షేపించగా సభ మంత్రి శ్రీ ఖన్నా కొంత ఉద్రిక్తులై అవసరమైనప్పటికీ జవాబిచ్చారు- మరి సన్యాసులుకూడా ఉద్రిక్తులయితే ఎలాగని గృహస్తులకు సన్యాసులకూ తేడా ఉందని శ్రీ మురార్జీ ప్రస్తావించారు-

మంత్రులఇళ్లకు నీరు, విద్యుచ్ఛక్తి సప్లయిని నియంత్రించాలన్న అభిప్రాయాన్ని ప్రభుత్వము పరిశీలిస్తున్నదని చట్టప్రకారము అలాంటి చర్యల్ని తీసుకోడానికి వీలులేదని శ్రీ ఖన్నా మరో ప్రశ్నకు జవాబుగా చెప్పారు. కొందరు మంత్రుల బిల్లులు అంతగా ఎక్కువ ఎందుకవుతున్నాయో ఆయా మంత్రులనే చెప్పగలుగుతుందని ఆయన అన్నారు-

(ఇటీవల కేంద్రహోంమంత్రి శ్రీ లాల్ బహద్దూర్ శాస్త్రి తన పదవిలో నీరు విద్యుచ్ఛక్తి బిల్లులు బాగా పెరిగిపోతున్నమాట వాస్తవమేనని ఒప్పుకున్నారు-)

మరో ప్రశ్నకు జవాబిస్తూ హోంమంత్రి శ్రీ లాల్ బహద్దూర్ శాస్త్రి తన నీరు, విద్యుచ్ఛక్తి బిల్లుల్ని తానే చెల్లించదలచినట్లు యీ పద్ధతి మిగతా మంత్రులుకూడా అనుసరిస్తారని ఆశిస్తున్నాననీ అన్నారు-

రాష్ట్రపతిభవనములో కూడా నీరు, విద్యుచ్ఛక్తి వాడకాలను పొదుపుచేయడానికి అవకాశాల్ని పరిశీలించి తనకు సూచనలు ఇవ్వాల్సిందిగా రాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ తనను కోరారని కూడా శ్రీ మెహర్‌చంద్ ఖన్నా ఒక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించారు.

## ప్రధాని నెహ్రూకు టెలిగ్రాం

హైదరాబాదు, మార్చి 14

మైసూర్ మహారాష్ట్ర ఒత్తిడులకు లొంగరాదని కడిజలాలపై 1951 ఒప్పందాన్ని మార్చరాదని కోరుతూ ప్రధాని నెహ్రూకు శేషనల్ డెమోక్రాట్ గ్రూపు సభ్యులు ఒక టెలిగ్రాం పంపారు. ఈ గ్రూపు నాయకులు శ్రీ తెన్నేటి విశ్వనాథం.

## కలకత్తా సంప్రదింపులు ఫలప్రదం కావాలి

న్యూఢిల్లీ, మార్చి 14

కలకత్తాలో కాశ్మీర్ తదితర అపరిష్కృతాంశాలపై ఇండియా పాకిస్తాన్‌ల మధ్య జరుగుతున్న సంప్రదింపుల అధ్యాపనిస్తూ పార్లమెంటులోని పలువురు కాంగ్రెస్ సభ్యులు ఒక ప్రకటన చేశారు. నిరు ఈ సంప్రదింపులు విజయవంతంకాజాలని కోరుతూ జమ్మూ-కాశ్మీర్ విభజన జరుగరాదని మన లౌకిక రాజ్యాంగ సూత్రాలకు భంగం కలుగరాదని కోరారు.

ఈ ప్రకటన చేసినవారిలో డాక్టర్ హరేకృష్ణ మెహతాబ్, సురేంద్ర మోహన్ ఘోష్ రఘునాథ్ సింగ్ వి. ఆర్. బానప్ప కలరు.

## అఫ్గనిస్తాన్‌లో నూతన మంత్రివర్గం

### డా॥ మహ్మద్ యూసఫ్ కాబూల్ నాయకత్వాన ఏర్పాటు

అఫ్గనిస్తాన్, మార్చి 14

అఫ్గనిస్తాన్ నూతన ప్రధాని డా॥ మహ్మద్ యూసఫ్ తన మంత్రివర్గపు పేర్ల జాబితాను నిన్న ప్రకటించి రాజుకు సమర్పించారు. శ్రీ మహ్మద్ దావూద్ ఖాన్ మంత్రివర్గం గత ఆదివారం నాడు రాజీనామా యిచ్చినది. ఆ మంత్రివర్గంలో గనుల పరిశ్రమలు శాఖల మంత్రిగా వ్యవహరించిన డా॥ యూసఫ్‌ను తన మంత్రివర్గమేర్పాటు చేయవలసిందని అఫ్గనిస్తాన్ రాజు కోరారు.

## శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డికి సన్మానం

### వచ్చే నెల జరుపుటకు నిర్ణయం

హైదరాబాద్, మార్చి 14

ఆంధ్రప్రదేశ్ గత ముప్పది సంవత్సరాలనుండి అర్థిక మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి చేసిన సేవను పురస్కరించుకొని వచ్చే నెల సన్మానం జరుపుటకు నిర్ణయమైనది.

నిన్న సాయంత్రం దేవాదాయ శాఖ మంత్రిణి శ్రీమతి టి.ఎన్. సదాలక్ష్మి అధ్యక్షతన జరిగిన సమావేశంలో శ్రీ బ్రహ్మానందరెడ్డికి రు. 55 వేలు సమర్పించాలని ఈ మొత్తాన్ని హైదరాబాద్ నగరంలో మహిళా హాస్టల్ నిర్మాణానికి వినియోగించాలని కూడా నిర్ణయించబడింది.

## ప్రాచీన నాగరికతావశేషాలు

మాస్కో, మార్చి 14

కాస్పియన్ సముద్రానికి పశ్చిమభాగం విశాలమయిన ఎడారులూ, అర్ధఎడారులూ ఒకప్పుడు పండ్ల తోటలు గానూ, పొలాలగానూ వుండేవని సోవియట్ పురావస్తు శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేశారు. ఈ ప్రదేశములో కొన్నిరకాల చెట్లపుప్పొడి, మట్టిలో ఎండిన గడ్డిపరకలూ, ఆకులూ లభించాయి.

ఆరు శతాబ్దాలపాటు యిక్కడుండిన ప్రాచీన నాగరికత 17వ శతాబ్దంలో మంగోలుల దాడితో తుడిచిపెట్టుకు పోయింది.

ఇప్పుడీ ప్రదేశమంతా ఇసుకతో కప్పబడి వుంది. అయితే సోవియట్ పురాతత్వవేత్తలు యీ ఇసుక క్రింద నాగాలోతున నీటి వూటలను కనుగొన్నారు. తర్వాత జలవిజ్ఞాన శాస్త్రజ్ఞులు యిక్కడ అనేక గొట్టపు బావులు ఏర్పాటు చేశారు. ఇక్కడ ఇప్పుడే 80 వేల హెక్టర్ల భూమినుండి ఇసుక తొలగించబడింది. రాబోవు కొద్ది సంవత్సరాలలో మరొక 20,00 హెక్టర్లు సాగుచేయబడతాయి.

## బారౌని నూనెశుద్ధి కర్మాగారం

### 1963 చివరి భాగంలో ఉత్పత్తి ప్రారంభం

న్యూఢిల్లీ, మార్చి 14

1963 తుది మూడు మాసాలలో పరిశీలించిన విదప బారౌని నూనెశుద్ధి కర్మాగారంలో తొలివిడతలున్న యూనిట్‌లో ఉత్పత్తి ప్రారంభింప బడుతుంది. నిన్న లోకసభలో ఎన్. ఆర్.-లాసూర్ వేసిన ప్రశ్నకు గనులు ఇంధనశాఖ పార్లమెంటరీ కార్యదర్శి డి. తిమ్మయ్య ఈ సమాచారాన్ని అందజేశారు.

శుభకృత్ సం॥ ఫాల్గుణ శు॥ పంచమి రా 12-52 విశాఖ తె 5-16 ఉ వ 8-33 మొ: 10-23 వరకు (శాలివాహన శకము: 24-12-1884) 15-3-1963 శుక్రవారము

> " నేతికుండ మోచి యే
> తెలివున సోవవాలు
> వ్రాఁకు నైపుణంబు
> గలుగు పురుషునట్ల
> యోగ పరిణతుండును
> నాత్మ వేమ అక
> విముక్తి కెక్కవలయు."
> —భారతము (శాంతి)

గోలకొండపత్రిక

ఫోన్ నెం. 35280

15 మార్చి 1963
శుక్రవారము

## ప్రయివేటు కళాశాలల సాధక బాధకాలు

—(o)—

ఇటీవల మన రాష్ట్ర శాసనసభలో విద్యాశాఖ పద్దుమీద చర్చ జరిగిన సందర్భమున ఒక సభ్యుడు మాట్లాడుచు విశ్వవిద్యాలయము ఆధ్వర్యములో కళాశాలల కేంద్రీకరణము జరుగరాదనీ, యెక్కువ ప్రయివేటు కళాశాలల స్థాపన జరుగవలెననీ ఒక అభిప్రాయము స్ఫురింపజేసినారు. రోజు రోజుకు పెరిగి పోవుచున్న అవసరాల దృష్ట్యా యెక్కువ కళాశాలల ఆవశ్యకత అనివార్య మగుచున్నది. విశ్వ విద్యాలయమో లేక రాష్ట్ర ప్రభుత్వమో అవసరమైనన్ని కళాశాలలను స్థాపించలేక పోవచ్చును. అందువలన మన విద్యారంగములో ప్రయివేటు కళాశాలలకు గణనీయమైన ప్రాధాన్యమున్నది. జిల్లా కేంద్రాలలో, మారుమూల ప్రాంతాలయందు విద్యా సౌకర్యాలు లేనందువలనవిద్యార్థులుతప్పనిసరిగా పట్టణాలలోని కళాశాలలకు రావలసి వచ్చుచున్నది. పట్టణాలలో తగిన సౌకర్యాలు లేక విద్యార్థులు పలురకాల బాధలను అనుభవించుచున్నారు. పట్టణాలమీద యిప్పుడున్న భారము కొంతవరకైనా తగ్గవలెనన్నచో పల్లె ప్రాంతాలయందు కనీసము తాలూకా కేంద్రాలయందు విరివిగా కళాశాలలస్థాపన జరుగవలెను; వివిధకోణాలనుండి యిది చాల ప్రయోజన కరమైన పని. కాని అర్థిక కారణాలవలన విశ్వ విద్యాలయము గాని, ప్రభుత్వము గాని సంపూర్ణముగా యిన్ని కళాశాలల జరువును మోయలేవు.

ఇందుకు మార్గాంతరము ప్రయివేటు కళాశాలల స్థాపన; ప్రజాసంస్థలు, ధనవంతులు, దాతలు ప్రయివేటు కళాశాలల స్థాపనకు పూనుకొన వచ్చును; అయితే యీ కార్యము యెక్కువగా జిల్లా ప్రాంతాలయందు జరుగవలసియున్నది. అందువలన కళాశాలల స్థాపన, నిర్వహణ వ్యయముగూడ కొంత వరకు తగ్గగలదు. ఇంత మాత్రమున ప్రయివేటు కళాశాలల నిర్వహణయందు సమస్యలు యేవియును లేవని చెప్పలేము. ప్రభుత్వానికి, విశ్వ విద్యాలయమునకు యెదురయ్యే ఆర్థిక సమస్యలు ప్రయివేటు కళాశాలలను గూడ బాధించుచున్నవి. ముఖ్యముగా యిటీవల మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సును, పి. యు. సి. ని ప్రవేశపెట్టుట వలన ప్రయివేటు కళాశాలలు చాల యిబ్బందులను యెదుర్కొనవలసి వచ్చుచున్నది. ఈ కోర్సులవలన నిర్బంధముగ చదువవలసిన సబ్జెక్టుల సంఖ్య హెచ్చినది; సబ్జెక్టుల సంఖ్య హెచ్చుటవలన విశ్వ విద్యాలయము నియమాల ప్రకారము అధ్యాపకుల సంఖ్యను పెంచవలసి వచ్చినది. అంతేగాక కళాశాలలయందు సైన్సు ప్రయోగశాలల వ్యయముగూడ పెరిగి పోయినది. విశ్వవిద్యాలయము ప్రారంభించెడి యేదో వొక కొత్త పథకాన్ని ప్రయివేటు కళాశాలలు అమలు జరుపవలెనన్నచో వనరులను మించి వ్యయము పెరిగిపోగలదు. ఇంత ఖర్చు జరుగుచున్నప్పటికిని ప్రయివేటు కళాశాలలయందు అధ్యాపకులకు యిచ్చెడి జీతాలు చాల తక్కువ; విశ్వవిద్యాలయ విరాళసంఘము రూపొందించిన జీతాల పరిమితికి ప్రయివేటు కళాశాల అధ్యాపకులు పొందుతున్న జీతాలకు యెంతమాత్రము పోలిక కుదురదు.

ప్రయివేటుకళాశాలల ఆర్థిక పరిస్థితి యింత డోలాయమానముగ నున్నచో విద్యాస్థాయి కూడ దెబ్బతినగలదు. మన విద్యారంగమునందు ప్రయివేటు కళాశాలలకు ప్రధానమైనపాత్ర ఉన్నది గనుక రాష్ట్ర ప్రభుత్వము, విశ్వ విద్యాలయము, విశ్వవిద్యాలయ విరాళసంఘము ప్రయివేటు కళాశాలల బాగోగులను జాగ్రత్తగా పరిశీలించి అవసరమైన సహాయాన్ని అందించవలసియున్నది.

## ఉత్తర ఆర్కాట్ జిల్లాలో రాగినిల్వలు

న్యూఢిల్లీ, మార్చి 14

రాగిసీసము తుత్తునాగము నిల్వలు మద్రాసు రాష్ట్రములోని దక్షిణ ఆర్కాట్ జిల్లాలో కనుగొనబడినవి. ఇవిఅన్నికలిసి 8 లక్షలటన్నులు ఉండ గలవని అంచనా.

నిన్న లోకసభలో గనుల ఇంధన శాఖ మంత్రి కె. డి. మాలవీయ ఒక ప్రశ్నకు వ్రాతమూలకముగా సమాధానమిస్తూ ఈ సమాచారాన్ని అందజేశారు.

## దేశంలో బొగ్గు సరఫరా పరిస్థితి

### మెరుగు పడిందని లోక్‌సభలో కేంద్రగనులు బొగ్గు పరిశ్రమల శాఖ పార్లమెంటరీ కార్యదర్శి వెల్లడి

న్యూఢిల్లీ, మార్చి 14

దేశములోని బొగ్గుసరఫరా పరిస్థితి బాగా మెరుగుపడిందని నిన్న లోకసభ ప్రశ్నోత్తరాల సమయములో ఒక ప్రశ్నకు కేంద్రగనులు బొగ్గు పరిశ్రమలశాఖ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ డి. తిమ్మయ్య జవాబుచెప్పారు. 1962 అక్టోబరునుంచి గత జనవరివరకు బొగ్గురవాణా నెలకు...మిలియన్ టన్నుల చొప్పున జరిగిందని 1961వ సంవత్సరములో అక్టోబర్‌నుంచి 1962 జనవరి వరకు నెలకు 4 మిలియన్ టన్నుల చొప్పున రవాణా అయినదని ఆయన వివరించారు. దేశములో తలెత్తిన అసాంతర పరిస్థితుల దృష్ట్యా ముఖ్యమైన వినియోగదార్లకు పరిహార్యంత బొగ్గుసరఫరా చేయుటకయి అవసరమయినచర్యలు తీసుకో బడుతున్నాయని శ్రీ తిమ్మయ్య తెలిపారు. ముఖ్యమయిన వినియోగదార్ల అందరి వద్ద బొగ్గు నిల్వలున్నాయని ఆయన చెప్పారు.

## మేనెలలో డీన్‌రస్క్ రాక

న్యూఢిల్లీ, మార్చి 14

మేనెలలో అమెరికన్ స్టేట్ సెక్రెటరి డీన్‌రస్క్ భారతదేశానికి రాగలరు. మే 2వతేదీన భారత దేశానికి రస్క్‌వచ్చి 4వ తేదీన వెళ్ళిపోతారు.

## ప్రభుత్వశాఖలలో కొన్నింటిని రద్దుచేసే ప్రతిపాదన

### ఆత్యయిక పరిస్థితులదృష్ట్యా పరిశీలనలోలేదని అసెంబ్లీలో ముఖ్యమంత్రి ప్రకటన

హైదరాబాదు, మార్చి 13

అత్యయిక పరిస్థితుల దృష్ట్యా ప్రభుత్వశాఖలలోని కొన్నింటిని రద్దుచేసే యోజనలేదు ప్రతిపాదన రాష్ట్రప్రభుత్వ పరిశీలనలో లేదని ముఖ్యమంత్రి శ్రీ నీలంసంజీవరెడ్డి నేడు అసెంబ్లీ ప్రశ్నోత్తరాల సమయంలో ఒకప్రశ్నకుచెప్పిన జవాబులో తెలియచేశారు.

గత డిసెంబరులో కన్యాకుమారి వద్ద జరిగిన దక్షిణప్రాంతీయ మండలి సమావేశంలో కృష్ణాగోదావరి నదీ జలాలవివాదసమస్య చర్చకురాలేదని ఆయన మరొప్రశ్నకు సమాధానమిచ్చారు. జోనల్ కౌన్సిల్ సమావేశాలలో వివాదగ్రస్తవిషయాలు చర్చకు రావంటలేదని ముఖ్యమంత్రియానంద ర్భంలో వచ్చినఉపప్రశ్నలకు జవాబు చెపారు. శ్రీ తెన్నేటివిశ్వనాథంఅడిగిన ప్రశ్నకు ఆయన జవాబు చెబుతూ జోనల్ కౌన్సిల్ సమావేశాల వివరాలను అసెంబ్లీకి అందజేయుటకై యితర రాష్ట్రాలతో తాము సంప్రదించవలసి వున్నదన్నారు.

### విద్యార్థుల సహకార స్టోర్సుల వివరాలు

గత జూన్ 30వ తేదీ వరకు స్టూడెంటు కోపరేటివ్ స్టోర్సులు ఆంధ్రప్రాంతములో 27 వున్నాయని తెలంగాణాలో 5 మాత్రము వున్నాయని రాష్ట్ర అర్థిక సహకార శాఖల మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి చెప్పారు. ఆంధ్రప్రాంతంలోని 3విద్యార్థుల సహకారస్టోర్సులు 1961-62లో దివాలాతీశాయని ఆ సంవత్సరములో విద్యార్థుల కోపరేటివ్ స్టోర్సులలో యే ఒకటి రద్దుకాలేదని ఆయన పేర్కొంటూ 1961-62లో తిరుపతిలో యే విద్యార్థుల కోపరేటివ్ స్టోర్సు మూతపడలేదన్నారు.

తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీకి చెందిన విద్యార్థుల కోపరేటివ్ స్టోర్సుకు1959నుంచి కార్యకర్తగావున్న వారు స్టోర్సువ్యవహారాలపట్ల తగినంత శ్రద్ధతీసుకోవటంలేదన్న అభిప్రాయాన్ని రాష్ట్ర మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి వ్యక్తంచేశారు. కాలేజీల్లో జరిగే విద్యాబోధ తెలుగు మీడియంలోకి మార్చాలన్న ప్రతిపాదన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల పరిశీలనలో లేదని విద్యా మంత్రి శ్రీ పి. వి. జి. రాజు అసెంబ్లీలో ఒక ప్రశ్నకు జవాబు చెప్పారు. హైద్రాబాదు నగరంలోని ఒక మహిళా కళాశాలలో తెలుగు మీడియంలో పి. యు. సి. తరగతులు నిర్వహించుటకు ప్రయోగాత్మకంగా అనుమతి యివ్వటం జరిగిందన్నారు.

ఈ సందర్భములో వచ్చినఅనుబంధ ప్రశ్నలకువిద్యామంత్రిజవాబులు చెబుతూ యీ విషయంలో అంతర్విశ్వవిద్యాలయాలబోర్డు తాత్కాలికనిర్ణయాలను మాత్రం చేసిందన్నారు.

నిపుణుల సలహాను పొంది (విద్యా) విధానాలను రూపొందించవలెనని ప్రభుత్వం పూనుకొంటుందని ఆయన శ్రీ తెన్నేటి విశ్వనాథంకు చెప్పారు.

9వ తరగతినుంచి ఆంగ్లంబోధించాలని ప్రభుత్వం యిదివరకే ఉత్తర్వులు జారీచేసిందని రాష్ట్ర మంత్రి శ్రీ పి. వి. జి. రాజు మరో ప్రశ్నకు జవాబు చెప్పారు. ఈవిషయంలో వచ్చినఉపప్రశ్నలకు ఆయన జవాబు చెబుతూ మూడవ తరగతిలో ఇంగ్లీషు ప్రవేశ పెటవలసిన ప్రాథమిక పాఠశాలలు 12 వందలు వున్నాయన్నారు. తొలి దశలో 2 వేల మంది విద్యార్థులకు (మూడవ తరగతిలో) ఇంగ్లీషు బోధించబడుతుందని ఆయన పేర్కొన్నారు.

మూడవతరగతినుంచి స్కూళ్ళలో ఇంగ్లీషు ప్రవేశపెట్టే విషయంలో సంశయాలు యెదుర్కొంటున్న ఇబ్బందులను ఆయన ప్రస్తావించి ప్రభుత్వం రూపొందించినవిధానాలకు పరిధాయితీలు అనులు పరచవలసి వుంటుందని అన్నారు.

### హైద్రాబాదులో హాయ్యర్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్ నెలకొల్పే సూచన

మూడవ ప్రణాళికా కాలములో హాయ్యర్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్ హైద్రాబాదులో నెలకొల్పే ప్రతిపాదన ఒకటి కలదని విద్యా మంత్రి శ్రీ రాజుమల్లు ప్రశ్నకు జవాబుచెప్పారు. ఈ సందర్భములో కేంద్ర ప్రభుత్వమునకు రాష్ట్రం విజ్ఞప్తిచేసిందని జవాబు కొరకు యెదురుచూడటం జరుగుతోందని ఆయన తెలిపారు.

### స్టాక్ ఎక్స్ఛేంజీల అధ్యక్షుల సమావేశం

దేశంలో గుర్తించబడ్డ 7 స్టాక్ ఎక్స్ఛేంజీల అధ్యక్షుల త్రైమాసిక సమావేశం యీ నెల 15, 16 తేదీలలో యిక్కడ జరుగుతుంది.

## సైప్రస్ ఉపాధ్యక్షులు డా॥ కిచుకుకు ఘన స్వాగతం

### నాగార్జున సాగర్ విమానాశ్రయంలో

విజయపురిసౌత్ (నాగార్జునసాగర్), మార్చి 14

సైప్రెస్ ఉపాధ్యక్షుడు డాక్టర్ ఫజిల్ కిచుకు హైద్రాబాదునుంచి నిన్న యిక్కడికి ప్రత్యేక విమానములో రాగానే ఆయనకు ఘనస్వాగతమివ్వబడినది. రాష్ట్రపథనాలు హైవేస్ శాఖల మంత్రి శ్రీ మీర్ అహ్మద్ అలీఖాన్ సైప్రెస్ ఉపాధ్యక్షుని ఆహ్వానించి ఆయనను పుష్పమాలాలంకృతుని చేశారు. డా॥ కిచుకువెంట నాగార్జున సాగర్‌కు వచ్చిన ప్రముఖులలో సైప్రెస్ రక్షణశాఖమంత్రి శ్రీ ఉస్మాన్ ఒరేక్; సైప్రెస్‌లోని భారత హైకమీషనర్ శ్రీ ఎస్.ఆర్. ఛోప్రా ప్రభృతులుకలరు.

నాగార్జునసాగర్ విమానాశ్రయం వద్ద డా॥ కిచుకుకుస్వాగతమివ్వవచ్చిన ప్రముఖులలో చీఫ్ యింజనీరు శ్రీ జాఫర్ అలీ, నల్లగొండ జిల్లాకలెక్టరు శ్రీ అల్లయార్ ఖాన్, నాగార్జున సాగర్ స్పెషల్ కలెక్టరు శ్రీ అబ్దుల్ సాహెబ్, డి-ఎస్-పి- డియస్ ప్రభృతులు కలరు. సైప్రెస్ ఉపాధ్యక్షులు డా॥ కిచుకు సపరివారంగా విమానాశ్రయంనుంచి నాగార్జునసాగర్ శిల్పశాలలో జయల్పర్ష పురాతత్వ వస్తువులను తిలకించుటకై నాగార్జునకొండ మ్యూజియంకు వెళ్ళారు. నాగార్జున కొండనుంచి తిరిగివస్తూ శ్రీశైలపుర్వ లోవున్న పుల్లారెడ్డిగూడెం గ్రామము వద్దఆగి గ్రామస్థుల క్షేమసమాచారాలను అడిగి తెలుసుకొన్నారాయన. నిర్మాణదశలోవున్న డాంనుచూచిన మీదట సైప్రెస్ ఉపాధ్యక్షులు విజిటర్సు పుస్తకంలో తమ అభిప్రాయాన్ని వ్రాస్తూ ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తిఅయినప్పుడు భారతదేశం సంపదలతో తులతూగగలదని పేర్కొన్నారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణంలో పాల్గొంటున్న కార్మికులకు ప్రాజెక్టు సిబ్బందికి అభినందనలు తెలిపారు. డా॥ కిచుకు నిన్న పగలు 11-15 లకు యిక్కడినుంచి ప్రత్యేక విమానంలో పూనాకు వెళ్ళారు.

భారతదేశ పర్యటన చేస్తూ నిన్న యిక్కడికి వచ్చిన సైప్రస్ ఉపాధ్యక్షులు డా॥ కిచుకూ నిన్నఉదయము విమానములో నాగార్జునసాగర్‌కు వెళ్ళారు. ఆయన అక్కడ నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణాన్ని తిలకిస్తారు. డా॥ కిచుకు భార్య స్వల్పంగా అనారోగ్యానికి గురికావటము వల్ల ఆమె మరో విమానముపై పూనా నగరానికి వెళ్ళారు. డా॥ కిచుకు నాగార్జునసాగర్‌నుంచి ఈ దేద ఉదయము 11 గంటలకు పూనా వెళ్ళుతారు. ఇక్కడి విమానాశ్రయంలో సైప్రస్ ఉపాధ్యక్షునికి ముఖ్యమంత్రి మంత్రిమండలి సభ్యులు వీడ్కోలిచ్చారు.

## కాశ్మీర్ సమస్యపై ఇండో-పాక్ సంప్రదింపులు

కలకత్తా, మార్చి 14

కాశ్మీర్ తదితర వివాదాంశాలపై ఇండియా-పాకిస్తాన్ ప్రతినిధివర్గాల నాయకులు సర్దార్ స్వర్ణసింగ్, జడ్-ఎ- భుట్టో నిన్న ఉదయం 11గంటలకు రాజభవన్ కౌన్సిల్ చేంబర్‌లో సంప్రదింపుల ప్రారంభించారు.

నిన్న రెండు దేశాల ప్రతినిధివర్గాలు పదిహేనిమిషాలు సంప్రదించిన మీదట రాత్రి భోజనానికిముందు ఉభయ ప్రతినిధివర్గాల నాయకులు చెరి ఒక సలహాదారును తోడుతీసుకొని తాం ఐదు నిమిషాల పేపు సంప్రదించారు.

నిన్నటికి ప్రధానముగా చైనా పాకిస్తాన్లు కుదుర్చుకున్న సరిహద్దు ఒప్పందాన్ని గూర్చి చర్చించారని తెలుస్తున్నది.

ఈఇద్దరు మంత్రులు తమ సలహాదారుల వెంట నేటిమధ్యాహ్నం రెండు గంటలకు తిరిగి సమావేశమయ్యారు. నేటి సంప్రదింపులకుముందు సర్దార్ స్వర్ణసింగ్‌ను అమెరికా రాయబారి ప్రొఫెసర్ జె.కె గాల్‌బ్రెత్ కలసి అరగంట మాట్లాడారు.

## రాష్ట్రపతి ఇరాన్-అఫ్గనిస్థాన్‌ల పర్యటన

న్యూఢిల్లీ, మార్చి 14

రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ మే 6 నుండి 21 వరకు ఇరాన్‌లో పర్యటిస్తారు. రాష్ట్రపతి మే 11 నుండి 14 వరకు అఫ్గనిస్థాన్‌ను దర్శించగలరు.

## అంతా భారతదేశాన్ని గూర్చే

### జర్మనీలో యునెస్కో అధ్వర్యమున జరిగిన ప్రత్యేక పాఠశాల కృషి

ఫ్రాంక్‌ఫర్టు(డాక్), మార్చి 14

పశ్చిమజర్మనీలో ఫ్రాంక్‌ఫర్టు నగరములో నున్న ఒక సెకండరీ పాఠశాలల్లోనిబాలబాలికలు భారతదేశాన్ని గూర్చి యావత్తు విషయాలు కొద్ది వారాల కాలంలోనే నేర్చుకున్నారు. కురదలా సమాచారం ఏమయినా ఉంటే భారతదేశానికి చెందిన శ్రీ పుండలంగా రోలా ప్రిన్సిపల్ కార్యక్రమంతో పూర్తిచేస్తారు. శ్రీగారితో జర్మనీలోనే చాలకాలం నుండి ఉండి విద్యార్థులకు భారతదేశాన్ని గూర్చిన విషయాలు బోధిస్తున్నారు.

ఈ బడిలో అనుసరించే బోధనా పద్ధతులుకూడా భిన్నముగాఉంటాయి. బడిలో చదివే విద్యార్థులు పదునాల్గు సంవత్సరాలు మొదలు పదిహేడు సంవత్సరాలు మధ్యవయస్కులు. యిది వృత్తివిద్యనుగరపు పాఠశాలగా నిర్వహింప బడుచున్నది. పశ్చిమ జర్మనీలో యునెస్కో అధ్వర్యాన నిర్వహింపబడుచున్న పదునాలుగు పాఠశాలలో ఇదొకటి. మామూలు పాఠ్య విషయాలతో పాటు ఈ బడిలో "మానవుల హక్కు"లను గురించి ప్రత్యేక శ్రద్ధ వహించి బోధిస్తారు. అంతేగాక ఐక్యరాజ్యసమితి యు- ఎన్- ఒ- ప్రత్యేక కార్యశాఖలు, విదేశీయ సంస్కృతులు వంటివికూడ ప్రత్యేక కార్యక్రమంతో సంబంధించిన విషయమే, 'ఇండియా' కూడ. ఇండియాను గూర్చి జర్మన్ విద్యార్థులకు సంపూర్ణమయిన భావమివ్వడానికిగాను భారత దేశానికి సంబంధించిన చిత్రవస్తు ప్రదర్శన ఒకటి నిర్వహించారు. నవంబర్ మాసము నుండి ఇప్పటివరకు సుమారు మూరు ఫోటోగ్రాఫుల సహాయంతో ఫ్రాంక్‌ఫర్టు పిల్లలకు భారతదేశము యొక్క ప్రకృతి రమణీయత, నాటిసంస్కృతి, ఆధునిక నగరాల సుందర దృశ్యాలు చూపించారు. భారతదేశాన్ని గూర్చి జర్మన్ ప్రజలుకున్న అపోహలు పోగొట్టడానికి ఈ ప్రదర్శన ఉపకరించడమేగాక వారిలో భారతీయుల పట్ల సుహృద్భావము జనించి గౌరవం పెంగింది.

ప్రదర్శనకు అధ్వర్యము వహించినవారి కృతజ్ఞం చేకూరింది. నిన్న వయస్సు విద్యార్థుల భారతీయచరిత్ర సంస్కృతి, మతం, ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయాలలో ... జ్ఞాన హెచ్చింది. ఇండో-జర్మన్ మండలినుండి భారతదేశాన్ని గూర్చి సమాచారం అర్థించి తెప్పించుకున్నారు, భారతదేశానికి సంబంధించిన సంగీతం రికార్డులు, బొమ్మల పుస్తకాలు, యితరవిషయాలపై సమాచారం ఫ్రాంక్‌ఫర్టు స్కూలు తెప్పించారు. ఈ బడిలోని పిల్లలు ఇంటివద్ద అందరితోను భారత దేశము యొక్క గొప్పతనాన్ని ముచ్చటించటం అంతే సరదాపడుతున్నారు. అందుకనే ప్రదర్శనకు వచ్చే ప్రేక్షకుల్లో యితరులు అనేకమంది ఉండటం సంభవిస్తున్నది. ఇకముందు ఈ ఇండియా ఫోటోగ్రాఫు ప్రదర్శన మిగతా జర్మన్ నగరాల్లోకూడ నిర్వహించడానికి పథకాలు వేశారు.

—(యు.పి. యస్.)

## శ్రీ ఊటుకూరి రంగారావు మృతి

ఖమ్మం, మార్చి 14

వైరా గ్రామంలో ప్రఖ్యాత రచయిత జిల్లా కాంగ్రెస్ మెంబరు వ్యాసరచయిత, జిల్లా రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి గొప్ప కథకులు, కవి, అయిన శ్రీ ఊటుకూరి రంగారావు యీ నెల 11వ తేదీ పగలు ఒంటిగంటకు అకస్మాత్తుగా గుండెపోటు, రక్తపోటువచ్చి వెంటనే మరణించారు. ఈ వార్త వినగానే ఖమ్మంజిల్లా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి హీరాలాల్ మోరియా మండలి కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ భాజా నాగభూషణం తాలూకా కాంగ్రెసు వైస్. ప్రెసిడెంట్ శ్రీ సంపత్కుమార్ అనేక మరిది పురప్రముఖులు రచయితలు కవులు పండితులు కళాకారులు పదలాది ప్రజలు వారి అంతిమదర్శనము చేసుకొని పుష్పాంజలు ఘటించి పెద్ద వూరేగింపుతో రాత్రి పదిగంటలకు అంతిమ కార్యకలాపములు జరిపించి రంగారావుగారి ఆత్మకు శాంతిచేకూర్పుగాక యని భగవంతుని ప్రార్థించి వారి కుటుంబమునకు సానుభూతిని తెల్పిరి.

## సువర్ణ కార్మిక సంఘ అడ్‌హాక్ కమిటీ సమావేశం

సువర్ణ కార్మిక సంఘ అడ్‌హాక్ కమిటి సమావేశం యీ నెల 18వ తేది సాయంత్రం 5 గంటలకు హైద్రాబాదు పాత బస్తీలోని చావుణిలో వున్న ఆంధ్ర కిరోడాదేవాలయంలో జరుగుతుంది. శ్రీ యం. గోవిందాచారి సమావేశానికి అధ్యక్షత వహిస్తారు.

## మూసీనదిలో డాక్టరు రాజన్‌బాబు అస్తినిమజ్జనం

### ఈ నెల 24న జరుపుటకు సన్నాహాలు

హైద్రాబాద్, మార్చి 14

మాజీరాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ అస్తికలు యిక్కడ మూసీనదిలో యీ నెల 24న నిమజ్జనము చేయబడతాయి.

నిన్న జరిగిన సర్వోదయ కార్యకర్తలు పురప్రముఖుల సమావేశంలో డాక్టర్ రాజన్‌బాబు అస్తికల నిమజ్జన కార్యక్రమం నిర్వహించుటకై శ్రీ ప్రభాకర్‌జీ అధ్యక్షతన ఒక సంఘం ఏర్పాటు చేయబడినది.

ఈకమిటీలో సభ్యులుగానియమితులయిన 45 మందిలో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ఎ. పి. సి. సి. అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, రెవెన్యూ మంత్రి శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి, ప్రాంతీయ సంఘ అధ్యక్షులు శ్రీ టి హయగ్రీవాచారి, నగర మేయర్ శ్రీ ముకుముదినీదేవి మొదలగువారు కలరు.

డా॥ రాజన్‌బాబు అస్తికలనిక్కడికి తీసుకు రావడానికై రాష్ట్రసర్వోదయ మండలి కార్యదర్శి శ్రీ సి. వి. చారి యీ నెల 16న పాట్నాకు వెళ్ళారు. మాజీ రాష్ట్రపతి అస్తికలు రైలులో యీ నెల 24వ తేదీఉదయానికి యిక్కడికి తీసుకురాబడతాయి. నాంపల్లి స్టేషన్‌నుంచి అస్తికలనుగాంధీ భవన్‌కు తీసుకవచ్చి ప్రజలు వాటిని దర్శించుటకు వీలుగా ఉదయం8గంటల నుంచి మధ్యాహ్నం 3 గంటల వరకు ప్రదర్శనకుంచ బడతాయి. అస్తికలను తరువాత ఊరేగిస్తూ మూసీనదివద్దకు తెచ్చుట జరుగుతుంది. ప్రార్థనసమావేశానంతరం అవి నిమజ్జన చేయ బడతాయి.

## వెంకట్రావు మెమోరియల్ ఎడ్యుకేషన్ సొసైటీ

### నూతన పాలక వర్గం

హైద్రాబాదు, మార్చి 14

లాల్ దర్వాజాలోని వెంకట్ రావు మెమోరియల్ విద్యాసంస్థ సర్వసభ్య సమావేశం లాల్‌దర్వాజామునిసిపల్ గ్రౌండులో గత నెల 24న శ్రీ సూర్యప్రకాష్ అధ్యక్షతన జరిగింది. సమావేశంలో సంస్థ పాలక వర్గానికి జరిగిన యెన్నికల్లో యీ క్రిందివారు యెన్నికయినారు:

అధ్యక్ష ఉపాధ్యక్షులు శ్రీ టి. అంజయ్య ఎం. ఎల్. ఎ; శ్రీ ఎ. రాజగోపాల్ (మున్సిపల్ కార్పొరేటర్) ప్రధాన సంయుక్త కార్యదర్శులు శ్రీయుతులు వి. మాధవరెడ్డి, జి. దీనదయాళ్, కోశాధికారి శ్రీ ఎస్. యాదగిరిరావు, న్యాయ సలహాదారు శ్రీ మనోహర్ రాజ సక్సేనా మరో 10 మంది కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైనారు.

## కిరుబురు యినుపగనిపై కొండతెగల దాడి

### ముగ్గురు మృతి, 20 మందికి గాయాలు

చైబాసా, మార్చి 14

బీహార్-ఒరిస్సా సరిహద్దులో సింగ్‌భూం మైనింగ్ బెల్టుకు చెందిన కిరుబురుయినుప గనిపై కిరుబురు కొండతెగలవారు జరిపిన దాడిలో ముగ్గురు మృతిచెందారని గాయాలకు గురిఅయిన 20 మందిలో 6 గురికి బాగా దెబ్బలు తగిలాయని నిన్న యిక్కడికి తెలియవచ్చింది. ఈ కొండతెగలవారు మొన్న ఉదయం విల్లంబులతో గనివద్దకు దాడిచేయవచ్చారని ఇక్కడికి అందిన వార్తలో తెలుపబడినది. అంతకుముందు రాత్రి కిరుబురుకు చెందిన యిద్దరు ఆడపిల్లలపట్ల కొందరు బయటనుంచి వచ్చిన కార్మికులలో కొందరు అసభ్యంగా ప్రవర్తించటం జరిగినట్లు వార్తలో పేర్కొనబడింది.

ఈ జిల్లా కేంద్రంనుంచి రిజర్వ్ సాయుధ పోలీసు దళాలు కిరిబురు గనివద్ద పరిస్థితులను అదుపులోకి తెచ్చారు.

## భూదానోద్యమ దశాబ్ద్యుత్సవం

### పోచంపల్లిలో జరిగే సూచన

హైద్రాబాద్, మార్చి 14

దేశవ్యాప్తముగా నిర్వహించబడుతున్న భూదానోద్యమానికి వచ్చేనెల 18వ తేదీకి 10 సంవత్సరాలు పూర్తి అవుతాయి, భూదానోద్యమ జన్మస్థలమయిన పోచంపల్లిలో అదేరోజున దశాబ్ద్యుత్సవం జరుగుతుంది. ఈసందర్భంలో జరిగేసభకు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి అధ్యక్షత వహిస్తారు. ప్రణాళికా సంఘ సభ్యులు శ్రీ మన్నారాయణ్ తదితర ప్రముఖులు సభలో ప్రసంగిస్తారు.

## ఎలిమెంటరీ మిలిటరీ ట్రెయినింగ్ సౌకర్యం

### 480 స్కూళ్ళలో కల్పించుటకు పంజాబ్ మంత్రివర్గం నిర్ణయం

చండీఘడ్, మార్చి 14

రాష్ట్రంలో ఎన్. సి. సి. ట్రెయినింగ్ అమలులోలేని 480స్కూళ్ళలోని విద్యార్థులకు ఎలిమెంటరీ మిలిటరీ ట్రెయినింగ్ యివ్వదలచాలని పంజాబ్ మంత్రివర్గం నిన్న జరిగిన సమావేశములో ఒక నిర్ణయం తీసుకొన్నది. ఈ స్కూళ్ళలో ఉన్నత తరగతులు, హయ్యర్ సెకండరీ తరగతులకు చెందిన విద్యార్థులకు సైనిక శిక్షణ ఇవ్వబడుతుంది.

## 5 దక్షిణరాష్ట్రాలలో వరదల ఉధృతం

### 17మందిమృతి, 80వేలమందికి నిరాశ్రయత

న్యూయార్కు, మార్చి 14

5 దక్షిణ రాష్ట్రాలలో వరదలు ఉధృతరిగావచ్చినట్లు నిన్న యిక్కడికి వార్త చేరింది. ఈవరదలవల్ల 17మంది మృతిచెందారని 80 వేలమంది నిరాశ్రయులయ్యారని వార్తలో తెలుపబడింది. ఈ సందర్భంలో పెక్కు మిలియన్ డాలర్లువిలువచేయు ఆస్తులకు నష్టం వాటిల్లినట్లు తెలుస్తున్నది. 81 పల్లె ప్రాంతాలను వరదలకు గురియయిన ప్రాంతాలుగా ప్రకటించవలసి వచ్చినదని ప్రెసిడెంటు కెన్నెడీకి పశ్చిమ వర్జీనియానుంచి ఒకవిజ్ఞప్తివచ్చినది.

వరదలవల్ల సంబంధాలు తెగిపోయినప్రాంతాలలో నివసించేవారికి ఆహారపదార్థాలు సరఫరాచేయుటకై హెలికాప్టర్లు ఉపయోగించబడుచున్నవి.

## వ్యవసాయదారులపట్ల బ్రిటిష్ప్రభుత్వం శ్రద్ధ

### వ్యవసాయోత్పత్తుల ధరల రక్షణకు రూ.33,60,00,000

న్యూఢిల్లీ, మార్చి 14

వ్యవసాయోత్పత్తులకు గిట్టుబాటు ధరలను కర్షకులకు లభింపజేయడానికి 1963-64 బడ్జెట్‌లో రూ-33,60,00,000 కేటాయించినది బ్రిటిష్ ప్రభుత్వం. వర్తమాన ఆర్థికసంవత్సరంలో ఈ పద్దున కేటాయించిన మొత్తం కంటేఇదిరూ.1,6.,00,000లుఎక్కువ.

వచ్చే ఆర్థిక సంవత్సరంలో విదేశాలలో బ్రిటన్ చేసే ఖర్చు ఈ ఆర్థిక సంవత్సరంలో యీపద్దు కేటాయింపుకంటే రూ-4,50 లక్షలు, చేసినఖర్చుకంటే రూ-4,50,00,000 ఎక్కువగా ఉంటుంది.

ఇతరదేశాలకు ముఖ్యంగా భారతదేశానికి పై నికరసహాయం ఎక్కువగా చేయవలసిరావడమూ, వర్ధమాన దేశాలకు చేసే సహాయాన్ని విస్తృతం చేయడమూ, అంతర్జాతీయ సంఘాలకు ఇచ్చేవిరాళాలు ఎక్కువచేయడమూ ఈ పద్దున కేటాయించిన మొత్తం ఎక్కువకావడానికి కారణాలని అంటున్నారు.

ఇందుకు ఉదాహరణంగా కామన్‌వెల్త్ వ్యవహారాలశాఖ అంచనాను పేర్కొనవచ్చు. ఈశాఖఖర్చు రూ-149.0000 నుంచిరూ-2,25,90,000కు పెరిగింది.

## యు.పి. కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ బలం 258 కి పెరుగుదల

లక్నో, మార్చి 14

యు.పి. లోని ప్రతిపక్షానికి, ఇండిపెండెంట్లకు చెందిన 10 మందిసభ్యులు ఇటీవల రాష్ట్ర కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీలో చేరటవలన పార్టీబలం 248 నుంచి 258 కి పెరిగిందని నిన్న ఇక్కడ అధికారికంగా వెల్లడయింది.

కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీలో కొత్తగాచేరిన 10 మంది సభ్యులలో 5 గురు ఇండిపెండెంట్లు, 4 గురు ప్రజాసోషలిస్టులు ఒక నామినేటెడ్ సభ్యుడు కలరు.

## పామర్రుసభలో శ్రీ అయ్యదేవర వారికి జోహార్లు

పామర్రు, మార్చి 14

భారతీసమితి అధ్వర్యమున ఇటీవల శ్రీ దత్తాత్రేయ విద్యాలయములో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారి వర్ధంత్యుత్సవం జరిగింది. శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావు సభకు అధ్యక్షత వహించారు. శ్రీ పంతులుగారి ప్రజాసేవను, భాషాసేవను శ్రీయుతులు టి. వీరాంజనేయులు, కాగంటి శరభయ్య గారలు కొనియాడి జోహార్లర్పించారు.

